# వక్తవ్యము

ఈ కావ్యము నొక్కపట్టున పఠించుటకన్న ప్రతి ఘట్టము తుదను గొంత విశ్రాంతిని పాటించుట యుక్తము. వివిక్త ప్రదేశము, విభావరీ వేళయు నేతత్కావ్య రసాస్వాదనమున కనుకూలములు.

కావ్యప్రపంచ ధర్మములనుబట్టి రసికులు తత్తద్విషయమును, కళను, సమీక్షించి, విశిష్టతను గమనించి, హ్లాదము గొందురు.

ఇందలి నాయిక లక్ష్మీపదాంకిత యైనది. కిరాతార్జునీయము లక్ష్మీపద లాంఛితము. శిశుపాలవధము శ్రీపదాంకితము.

స్వాదుపరాఙ్ముఖులు కానివారెల్లరును కావ్యపఠన యోగ్యులు. అయినను, మహాకవి మార్గగాములు, పద్యగ్రథన రహస్యవేత్తలు, ప్రాక్ప్రతీచీ సాహిత్య సమీక్షా దక్షులు, కామకలా ప్రవీణులు, ఆరోగ్యవంతులు నగు ఆర్ద్రహృదయులే స్వారస్య నిర్ణాయకులు.

"కమనీయ కిశోర ముగ్ధమూర్తేః
కలవేణు క్వణితాదృతాననేన్దోః
మమ వాచి విజృమ్భతాం మురారే
ర్మధురిమ్ణః కణికాఽపి కాఽపి కాఽపి!"

— శి —

సాహితీ సమితి
తెనాలి, 1925

లీనేవ ప్రతిబిమ్బితేవ
  లిఖితే వోత్కీర్ణరూపేవ చ
ప్రత్యుప్తేవ చ వజ్రలేప
  ఘటితే వాంతర్నిఖాతేవ చ
సా న శ్చేతసి కీలితేవ
  విశిఖై శ్చేతోభువః పంచభిః
చిన్తా సన్తతి తన్తుజాల
  నిబిడ స్యూతేవ లగ్నా ప్రియా.

—భవభూతిః

# విభ్రమము

౧

మినుకు మినుకని చుక్కలు మెరయుచుండె
అనగి పెనగు దిగంతమ్ము లాకసమ్ము
నలుపుగా దోచుచుండ మహీధరమ్ము
ఉభయ పార్శ్వాల శోభిల్ల సస్యజములు.
శాంత రమ్య తమస్విని సమయమందు
కలరవం బైన బందరు కాల్వలోని
నీరరేఖను బ్రాపించి కూరుచుంటి
ప్రాణసఖుతోడ ఘట్టాన పడవమీద.
ఆడవచ్చెను సయ్యాట లస్మదీయ
లలిత పాండుర చేలాంచలాలతోడ
నీల సుస్నిగ్ధ నిబిడాలకాళితోడ
పవనబాలకు డానీటిపట్టునందు.
కృష్ణవేణీ తరంగిణీ గీతరవము
కర్ణముల మందమందమ్ముగా నదింప
నిన్ను వర్ణింప సాగెను నిరుపమాన
రమ్యవాక్కుల సుకవి నా ప్రాణసఖుడు.

హంసపల్కులచే నిషధాధిపతికి
భీమ భూపాల పుత్త్రిపై ప్రేమహేల
ఆప్తవాక్కులచే రాగ మంకురించి
కోరకితమయి యయ్యెను కుసుమితంబు.

విజయవాటీ పురమ్మును వీడి యవల
కృష్ణవేణీ మహాతరంగిణిం దరించి
పర్వతశ్రేణి దాటి సంభ్రమముతోడ
దక్షిణాపథవర్తియై తరలె మనసు.

౨

ఆ మనోహర మాఘ సాయాహ్నవేళ
ఇష్టసఖులతోడ సరణి నే నేగుచుండ
అక్కజము గొల్పి తోచె నీ యాననమ్ము
సరసిపై దేలియాడెడి జలజమట్లు.

మధుపమై పోయె నపుడె నా మానసమ్ము
నీ ముఖాబ్జమ్ముపై వాలు నిరతితోడ.
పాదయుగళమ్ము తోడనె పార్శ్వమునకు
తిరిగి కదలగ జొచ్చె విధేయ మగుచు.

సుందర ద్వార దేశమ్మునందు నపుడు
సత్రసిష్మగ నున్న నీ గాత్రవల్లి
పటగతం బయి అవృతబద్ధ మైన
ప్రతిమపోలిక నాకు విభ్రమము గొలిపె.

ఆ ముహూర్తమునం దద్భుతావహముగ
నీ కటాక్షేక్షణావళీ నిశిత విశిఖ
పతితి తాకగ మన్మనోవిహంగ మపుడె
వ్రాలి టిలి వాలె నీ పాదపద్మయుగళి !

నీ మనోహర వసన నిర్ణిద్ర విమల
సాంద్ర చిత్రిత సహకార జాలకాళి
మధ్యసీమను మీనాయమాన మగుచు
సంచరించె మదీయ లోచన యుగంబు.

మహిత లావణ్య విద్యోతమాన తావ
కానన సుధాంశు బింబమునందు నిలిచి
మరల దయ్యె చకోరము మాడ్కి దేవి,
దివ్య రాగార్ద్రమైన నా దృష్టి యపుడు.

తప్ప దాయెను నిను వీడి తరలి చనక :
మరలి చూచితి, వీక్షణ మాలికలను
బరపితివి శాంతగతిని నాపైన దేవి,
ధన్యతం గంటి నంచు నే దలచుచుండ !

## 3

నీ మనోహరమూర్తినే నిలిపి మదిని
మెల్లగా బోవుచుంటివి మీా మేడదరిని.
తలపని తలంపుగా భవద్దర్శనంబు
కలిగినది నాకు కన్నులకరవుతీర.

పద్మ సంకాశమైన నీ పాణియందు
సంస్కృత గ్రంథరాజమ్ము సంతరించి
అంచనడకలతో నరుదెంచినావు
దివ్యశోభను భాంతిదీప భాతి.

కమ్ర సుస్నిగ్ధ నీలాంశుకమ్ము దాల్చి
ఎదురుపడినావు నాకపు డింపు లోలుక
కోమలాంబుద సన్నిభ శ్యామగాత్రు
లలిత సంశ్లేషమందలి లక్ష్మివోలె.

కన్నులరమోడ్చి ఆననకమల మల్ల
రమ్యముగ వాల్చి లజ్జాభిరామగతిని
లలిత జంగమ కాంచన లతికరీతి
హర్మ్యభాగమ్ములోనికి నరిగినావు.

చటుల విభ్రమగతి భవత్కుటిలకేశ
జాలమున జిక్కుకొనియె లోచనయుగమ్ము :

నవముగు సౌహృదము లేక బంధనమునందె
స్వాతంత్ర్యమున్ను నరళగునందాక దేవి!

౪

దేహళీ పార్శ్వమున నిల్చి దేవి, నాదు
నేత్రముల గాంచుచుంటివి వెన్నెల "ప్రభలు."
చూచుచుంటిని మిగుల సుత్సుకతతోడ
సౌధమున నిల్చి నీ ముఖప్రభలు నేను.

స్తిమిత కోమల మైన నీ సితవిలోక
నావళికి సాంద్ర మైన నా యసిత నిశిత
దృక్కులను సంఘటిల్లిన దెనుగుకోలు
కుముద నీలాంబుజంబుల గుమివిధాన.

తృప్తి తీరక భవదీయ దివ్యవదన
మండలాభపయిన్, నేను మరల మరల
వెను దిరిగి చూచుచుంటి వెగ్గలంపు
తటిని కెదు రేగుచుండెడి తరణివోలె.

మనను నిలుపంగ జాలక మగుడ నేను
శీఘ్రగమనముతో ప్రదక్షిణము చేసి
మరలివచ్చితి వేరొక మార్గమునను
నీ ముఖాంభోజ దర్శన నిష్ఠతోడ.

అరుగ నుంటివి సౌధాంతరాళమునను :
దేవి, మద్వదనంబు నీ దృష్టిపథము
నందు దోచుటచే భవదాననంబు
రక్తిమం దాల్చె లజ్జాభిరామ మగుచు.
కోమల మనోజ్ఞ విమల దృక్కోణ తరళ
దివ్య శీతల భవదీయ దృష్టి లవల
పిక్కటిల్లి మదానన బింబమునయి
చెలువుగా వాలె వెన్నెల పులుగు లట్లు.
మరలి చనుచుండ నీ వంత మందిరాంగ-
ణా ప్రదేశమువెంట నా నయన యుగళి
కమ్ర సుస్నిగ్ధ భవదీయ గండఫలక
భాగమున లాస్య మాడె జృంభణముతోడ.
గ్రీవము మనోజ్ఞముగ వంచి క్రింది చూడ్కి
మోహన మయూరిపోలిక నాహరించి
ఏకకాలమునందె మదీక్షణములు
చిత్తమునుగూడ, సౌధమ్ము చేరినావు.

౫

అగ్రహార నృసింహాలయాంగణమున
నీవు స్వజనాంతరితవుగా నిలిచి యుండ

కానరాదాయె నీ ముఖకమల మదెయ్యె
స్వర్గముల నూటుపడిన పుష్పమ్ముపోలె !
మధుర మంథరగతి నీవు మందిరమ్ము
లోని కేగుచునుండ నాలోలదృష్టి
మార్గమున తన్మయం బయి యనుసరించె
పల్లవ మనోజ్ఞ మైన నీ పాదయుగళి.
నీ ముఖజ్యోత్స్న నామీద నెరయుకొరకు
ఆలయములోని కల్లన అరిగినాను.
ఇంతలోనన చంచలాకాంతపోలె
తరలిపోతివి వేరొక ద్వారసరణి.
చిమ్మచీకటి క్రమ్మె హృత్సీమ నపుడు,
చూడ్కు లున్న సమస్తమ్ము శూన్య మయ్యె.
దేవి, ఈ భక్తునకు నింక ధ్యేయ మొకటె-
స్థలకమల రమ్య మైన నీ చరణయుగళి !

•

౬

దేవి, ఈ నేత్రములకు యాదృచ్ఛికముగ
త్వన్మనోహర రూప సందర్శనాభి
సిద్ధికై యెన్నిసార్లు నిల్చితినో తెలియ
దహహా, వాతాయనమ్ముల కభిముఖముగ.

విమల కమనీయ వదనారవింద మహిత
వీక్షణాకర్షణాసక్తి దేవి, త్వదీయ
సౌధ సవిధమ్మునకు నెన్నిసార్లు తీర్థ
యాత్ర సల్పితినో తెల్ప నలవి గాదు.

అమల సంజీవనౌషధం బౌ త్వదీయ
శాంత రమ్య కృపాకటాక్షమ్ము గాంచ
చెలగి హర్మ్యమునకు ప్రదక్షిణము లెన్ని
చేసినాడనో లెక్కించి చెప్పలేను.

హృదయభార ఘనధ్వాంత విదళనాప్త
చంద్రికా కాంతిపూర దుగ్ధస్నాత
దివ్య దరహాసమునకు మందిరమగు నిన్ను
కెన్నిసారులు వచ్చితి నెరుక లేదు !

## ౨

శాంత శీతల రమణీయ సాంధ్య వేళ
నరుగుదెంచుచు విద్యాలయమ్మునుండి –
రమ్యరూపము మన్మనోరథము దాల్చి
యెదురుపడినట్లు – నీవు కాన్పించినావు !
క్షౌమధారిణివై చతుష్పథము వెంట
ధీరగమనమ్ముతో నరుదెంచు నీవు

కనులఁ గప్పని కంఠశృంగాటకమున
వెలుఁగు వాగ్దీప్తిపోల్కి దోఁచితివి నాకు.

పార్శ్వద్వయమ్మును అంటుచే పక్షములను
పెంచుక కదల్చి యిటు ప్రసారించినావు
మనసిజుని పుష్పసంచక మువర్ణశోభ
మైన నిశితేషుగమ్ము రహస్యలీల.

ఘ్రాణమున వ్రాలి నాసికా సరణివెంట
నధరబింబముపై జారి యవల నీవు
స్మృతికపోల తలమ్మున నొదిగి తుదను
స్వర్ణతాటంకసీమ నాచూడ్కి నిలిచె.

భావభరమున నీ మృదు పదయుగమ్ము
తొట్రిలఁగ సాగిపోతివి త్రోవవెంట.
విస్మరింపక యేకాంతవేళలందు
నన్ను దలపోతువని మది నమ్మువాఁడ!

౮

సాంద్రమైన విభావరీ సమయమందు
జ్యోత్స్నాముఖ సుధాంశుబింబ సందర్శనాభి
రతిని నిల్చితి మీ హర్మ్య రమ్యపట్ట
భంగపాళీ లసత్పురోభాగమందు.

అంగణవిరాజమాన ఘనామ్రవిటపి
లలిత కుసుమ పరిమళ లహరి దెచ్చి
గంధవాహకుమారుడు కనికరమున
నాకు నామోద మొనగూర్చినాడు నిగుల.

దీపికల్ సదనాంతర దేశమందు
వెలుగుచున్నవి తారకావిలసనమున.
మురువు గుల్కెడు భవదీయ ముఖ సుధాంశు
బింబ ముదయింప లేదు సంప్రీతి నెరప.

నిష్ఫలం బింక నిచ్చట నిలుచు టనుచు
మది నిరాశను వ్యథ చెంది మరల నుండ
అంబువాహ తిరస్కరిణ్యంతరోది
తేందు మండలమట్లు కాన్పించినావు!

ధవళకౌశేయ పరిధానధారిణి వయి
దేహలత హేమదీధితి దేజరిల్ల
వల్లుగమనమ్ముతో నీవు వచ్చునపుడు
కేవలము లక్ష్మి వనియెడు భావ మొదవె.

అమృతబిందు కదంబక స్యంది, హృదయ
హారి, విస్ఫారిత విలోచనాబ్జయుగళి
నిండుగా నీవు నామీద నిలిపినపుడు
లయము నొందితి మాధుర్యలహరిలోన.

ద్వారదేశమునుండి తల్పార్శ్వమునకు
హంసయానమ్ముతోడ నీ వరిగినావు,
శోభనే రత్నపుత్రికా ద్యుతులతోడ
క్రమ్మరిలినావు ద్వారోపకంఠమునకె.
అలసవలితమ్ములై ఈషదార్ద్రము లయి
ముగ్ధహారిణీ విలోకనస్నిగ్ధము లయి
అలరు నీ నేత్రకోణ నిర్యత్కటాక్ష
పంక్తులకు పాత్ర మైతిని ప్రణయదేవి !
మధుర భావావళీ లసన్మతిని నేను,
మధురిమముకన్న మధురమౌ మధురమూర్తి,
మధురయామినీవేళ నీ మధురిమమున
పూర్ణముగ ముగ్ధభావము పొందినాడ !

౬

మెలగుచున్నావు నేత్రనిమీలనమున
మెలగుచున్నావు వీక్షణోన్మీలనమున
నిన్ను నిరతమ్ము ధ్యానించుచున్నవాడ :
దేవి, వీనికి వేరొండు దృష్టి లేదు !
ముకుళితమ్లాన మైన నా ముఖసరోజ
వికసనము సేయు తరుణార్కబింబ మీవ ;

నవసిపోయిన నా నేత్ర నవలయముల
శోషణము బాపు శీతలజ్యోత్స్న వీవ;
గాఢతాపార్తమైన నా గాత్రమునను
సాంద్ర పరిమళ చందనచర్చ వీవ;
ఆధిభరమున నిస్సారమైన హృదికి
చారు శీతల ఘన సుధాసార మీవ;
ఇంపు లొల్కగ జంగమహేమవల్లి
భంగి జెలగెడి నా బహిఃప్రాణ మీవ;
నన్ను పాలింప కమనీయ నవ్యగాత్రి
లతిక గైకొన్న నా భాగ్యలక్ష్మి వీవ;
అతి విశాల గభీర భవార్ణవంబు
నన్ను దాటింప జాలిన నౌక వీవ;
స్థిర పవిత్ర మదీయ హృత్పీఠ నిహిత
దివ్య విమలానురాగాధిదేవి వీవ!

౧౦

నిర్మల ప్రేమనిష్ఠమై నీ పదాబ్జ
పీఠమున నుంచినాను నా స్ఫీతహృదిని.
నీ యఖండిత కారుణ్యనిరతి నిపుడు
నా సమస్తము నర్పించినాను దేవి!

స్వచ్ఛ భవదీయ లావణ్య సరసిలోన
మజ్జనం బొనరించె మన్మానసంబు.
చిత్తమును పాపప్రవృత్తు లెల్ల
క్షాళితము లయ్యె, నిర్మలచ్ఛవి జనించె.

మహాంత జీవన నిమ్నగా మధ్యమందు
ప్రబల నైరాశ్య భీషణావర్త వితతి
బడి మునుంగును నేను! సత్ప్రణయదృష్టి
సాచి గ్రహియించి నన్ను కాపాడగదవె!

ఇంతలోకమునందు నీవే మదీయ
సుమార్గదర్శక దేదీప్యమాన తార,
వింత సంసారజలధి నీవే మదీయ
దివ్య సంస్థితి కమృతంపుదీవి దేవి!

౧౧

బౌద్ధులకు నాకు బుద్ధిలో ప్రణయమూర్తి,
అరయ నెంతటి తారతమ్యంబు కలదు!
ఉభయులకుగూడ సాదృశ్య మున్న దొకట :
నాకు వారలకును "త్రిరత్నములు" కలవు.

నిర్మలంబయి సంస్తవనీయ మగుచు
ఉత్కృష్టిప మత్సరయుగమునకు

దివ్యభూషాయుతు నన్నైు తేజరిల్లు
త్వద్గుణాగణంబు ప్రథమరత్నంబు దేవి !
చతురవాణీ లసత్ గ్రంథజాత పఠన
సక్త దృఢమత్యనాదృత సమయ మగుచు
అక్కజము గొల్పు నీదు విద్యాబ్ధి నిం తి
తరళరూప ద్వితీయ రత్నంబు దేవి !
ధీర గంభీర శాంత మదీయ హృదయ
చలన మొనరించి మరల సంసారవాంఛ
నధిక మొనరించుచున్న నీ యౌవనంపు
నవ్యశోభ తృతీయరత్నంబు దేవి !

౧౨

సుముఖుఁడ న్నేను సంసారసుఖమునెడల :
వీతరాగులు, సంసార విముఖ మతులు
శూన్యవాదులు బౌద్ధభిక్షుకుల కట్లు
దేవి, ఉన్నవి నాకును "త్రిశరణములు".
నిన్ను వర్ణించి నీ యెడ నిరుపమాను
రాగ ముదయింప జేసిన రమ్యమూర్తి
ప్రాథకవి చంద్రముండు నా ప్రాణసఖుని
యమృత నిష్యంది వాక్కుల నాశ్రయింతు.

అఖిల శృంగారనిధి జగదాశ్రయుండవు
భక్తవాంఛిత నిఖిల సంపత్ప్రదుండవు
నన్ను నిను బ్రోచు రాధికానాథదేవు
నంఘ్రిపంకేరుహమ్ముల నాశ్రయింతు.

అమలలోచనతారక, వంతరంగ
రాజ్యలక్ష్మివి, విమలానురాగనిధివి,
అస్మదీయ విశేష తపోనుభూతి,
వట్టి యుష్మత్కటాక్షమ్ము నాశ్రయింతు.

౧౩

తరుణ మార్తాండ రుచిపోలె నరుణ మగుచు
నీరజాతమ్ముపోలిక స్మేర మగుచు
పృథుశిరీష సంవర్తికా పేశల మయి
అలరు నీ పాదయుగళి ధ్యేయమ్ము నాకు.

వికసిత సరోజ నిర్నిద్ర విభ్రమమ్ము,
పూర్ణిమాచంద్రబింబ విస్ఫూర్తిశాలి,
ఇందిరామందిరము, సుధాహేమకలశ
మైన భవదాననంబు ధ్యేయంబు నాకు

ఫుల్ల నీలోత్పల ప్రభాపుంజ మగుచు
ఆర్ద్ర బాష్పామఘల ఝూ[illegible]హతి యగుచు

మంజులాకర్ణ విశ్రాంతి మహిత మగుచు
అలరు నీ నేత్రయుగళి ధ్యేయంబు నాకు.
వాసవమణి ద్యుతిచ్ఛటా భాసురంబు
చిక్కణ తమాల దీధితిస్నిగ్ధ ముగ్ధ
మం కళిందసుతా తరంగాభిరామ
మగు భవత్కైశికంబు ధ్యేయంబు నాకు.

## ౧౪

దేవి, నీ రమ్యమూర్తి! మదీయ హృదయ
పుండరీకాసనమున ప్రపూర్ణభక్తి
నిష్టదైవతముగ బ్రతిష్ఠించి యెపుడు
వివిధ విధముల నిన్ను సేవించుచుందు.
అపరిమేయానురాగ తోయమ్ములోన
నీకు నిత్యాభిషేకంబు నెరపుచుందు,
మధుర భావపరంపరా మాల్యములను
నీ మనోహరగళమున నిలుపుచుందు.
గాఢరస మంజులకవిత్వ గానఫణితి
వీను లలర భవత్కథల్ వినుతి చేతు.
హర్ష భరమున నైక్యమే యలరునట్లు
అంతరంగము చేతు సమర్పణంబు.

౧౫

శ్రవణములు సోకినంత మస్సహావిషాద
కర్దమక్షాళనము చేయ గలిగినట్టి
త్వన్మధుర నామధేయామృతమ్మె కాని
ఇతర మేమియు చెవి జేరనీయ నెపుడు.

దివ్య గంగాతరంగిణీ తీర్థమట్లు
భాషితావిల మార్జనపటిమ కలిగి
మధుమధుర మైన తావకకథలె గాని
ఇతరమును జిహ్వవెంట రానీయ నెపుడు.

చిత్తసద్ధ్వాంతరాశి సంస్థిత విచార
గాఢతమసంబు హరియింప గలిగినట్టి
భవ్య భవదీయ రూప దీపమ్ముకన్న
ఇతరమును దృష్టిసరణి రానీయ నెపుడు.

చారునిర్మల చంద్రికాపూరమట్లు
హృదయతాపము చల్లార్చి ముదము గూర్చు
త్వన్నిరంతర మధురభావనలె కాని
ఇతర మేమియు మదికి రానీయ నెపుడు!

## వి ర హ వీ చి

### ౧౬

ప్రేయసీ, ఘోల వింటివి నీ సేగ నేను!
ఆలకించిన దాడు నాపు తిమిరములు
పట్టి వింతరయు కాని మదీయ హృదయ
దుగ్ధ వార్ధిని మథన ముద్భూత మయ్యె.
అధిక మైన కొలందిని మథన మకట,
ఉద్గమించెను కాల కూటోగ్ర విషము.
ప్రేయసీ, నిర్వృతిని దాని బిగియ బట్టి
కంఠకుహరమ్మునందు శంకరుని భాతి.

ఉత్సుకతతో, నిరీక్షించుచున్న వాడ
భవ్య లక్ష్మీసమాగమ ప్రాప్తికొరకు
పూర్ణ నిరతావ్యయ సుధానుభూతికొరకు:
ఎన్నటికి నాకు లభియించు నివి యెరుంగ.

### ౧౭

సందెవేళను ప్రథమ దర్శనము మనకు
సంఘటిల్లిన విస్మయ క్షణమునందె

చిక్కుకొన్నది మామక చిత్తఖగము
సొగసుల భవద్విలోకన జాలకముల.
పట్టువడినది దృఢముగా పట్టియుగళి:
ఎగురజాలక అకట, ఈ హృదయఖగము
జీవితేశ్వరీ, మిగుల కృశించుచున్న
దన్యగతి యేమి కాన కపార్ణ్యశము.
కరుణ వహియించి యీ ఖ్యజాగ్రణికి నింక
బంధనవిముక్తి చేయుట పాడి కాదె?
త్వన్మనోహర పాణి సంస్పర్శనమున
పులకితం బయి నిర్వృతి బొందగలుగు.

## ౧౨

అయ్యయో, యేల చూచితి వట్లు నన్ను—
ఆ దినమ్మున మధుర సాయాహ్నవేళ
దేహళిని నిల్చి మోహినీదృష్టితోడ-
పథము వెంబడి జనెడి విభ్రాంతహృదయు!
విపుల భవదీయలోచన విగళదసిత
బహులతరకటాక్ష దృఢశరపంజరమున
మన్మనోభీష్టమూర్తి యేమాట లేక
వేగముగ వ్రాలి, పడిపోయె వివశగతిని.

జర్జరిత మగొన్న సకిట, నా సరళచిత్త!
యిప్పటికి గూడ బాధ శమింపలేను.
చిలుకకుంటివ, యేని నీ స్నేహాఘ్రార
మింక సంజీవనౌషధం బేది నాకు!

౧౯

ఈ హృదయదాహ మెట్టిదో యెగుక కాద
నీవు హృదయేశ్వరీ! నేను నిన్ను నమ్మి
సకలము త్యజించినాను నిస్సంశయముగ
నను గటాక్షింతు వనుచు నే నాటికైన.

ఎవ్వరికి తావు లేకుండ హృదయ మెల్ల
ఆక్రమించితి వౌక్షత్తె వక్కజముగ!
స్మరణకు నతీత మా పూర్వజన్మమందు
విమలబాంధవ్య మేదియో విలయు మనకు.

నిన్ను గాంచిన దాదిగా నేటివరకు
నిశ్చలమ్ముగ నీమీద నిలిచియుండి
బుద్ధి యన్యముఖమ్ముగా బోవలేదు—
దేవతా రూపిణివి నాకు కేవలమ్ము!

## ౨౦

అన్నపానీయములు విడనాడి నేను
వివిధ సుఖముల నన్నిటి విడిచి, ఘోర
తపము చేయుచునుంటి తాత్పర్యనిష్ఠ
నిన్నె లక్ష్యమ్ముగా మది నిలిపియుంచి.
అవయవమ్ములు ఘనతపోహవ్యవాహ
శిఖలతోడన మిగుల కృశించిపోయె.
కరములు కదల్పనున్న నకాండముగనె
జారిపడు నంగుళీయముల్ సాక్ష్య మిచ్చు.
దేవి, నా నిశ్చలత్వమ్ము తెలిసికూడ
ఇప్పటికినైన సాక్షాత్కరింప వేమి ?
జాగు చేసిన నీ కటాక్షమ్ము వలన
ప్రాణములు పోవు పిమ్మట ఫలము కలదె ?

## ౨౧

పక్షములు రెండు సర్వ ప్రపంచమునకు:
కృష్ణపక్ష మొక్కటి నాకు కేవలమ్ము.
నీవె నిస్సంశయమ్ముగా జీవితేశ్వ-
రీ, నిదానమ్ము నీ వైపరీత్యమునకు.

ఎల్లకాల మమావాస్యయే మదీయ
హృదయమున; ఎన్నడేని నీ వదనచంద్ర
కాంతి తోచునయేని ఆ క్షణమునందు
మాత్రము చతుర్దశీరాత్రి మాడ్కి నుండు.
స్వచ్ఛ భవదీయ ముఖ శరచ్చంద్రరోచి
ప్రణయినీ, చెప్పు మింక నెప్పటికి తోచు ?
అంధకారము విరిసి నిరంతరముగ
పూర్ణిమా పూర్ణయామిని పోలుచు నుండు ?

౨౨

గోచరించుచునుండును కొంతవరకు
మీ యజిర భూరుహాగ్రముల్ మేడకూడ
ఇపుడు నేను వసించెడి యీ విశాల
సమధికోత్తుంగ మంజుల సౌధమునకు.
ద్వితల పర్యంకవర్తినై దేవి, విపుల
జాలమార్గమ్ము వెంట మీ సౌధదిశను
గాంచుచుందును నే సముత్కంఠతోడ
సతత విస్ఫారితాగ్ర లోచనుడ నగుచు.
నిర్నిమేషము లౌ కనీనికలతోడ
వెర్రినై పోయి సౌధము, వృక్షశిఖలు,

సుందరపథంబు, మలకలు, చూచుచుండు
వింత సంతస మావిర్భవించుచుండ.

## ౨౩

ప్రియతమా, భవదాననబింబ దర్శ
నాభిలాషను మీ మేడ కరుగుదెంచి
కనుగొనక నిన్ను మందభాగ్యమ్మువలన
మరలి ప్రాపించినాను మ న్మందిరమ్ము.
మ న్మనోహారిణీ ముఖ మంజురుచికి
నోచుకొన్నవి కావు నాలోచనమ్ము
లనెడి సంతాపమున నుబ్బు నశ్రుబిందు
జాల మణచితి నెటులో కష్టమ్ముతోడ.
సౌధపార్శ్వమునందలి చలువరాతి
తిన్నెపై వాల్చితిని ప్రియా, దేహ మపుడు.
పండువెన్నెల రొదలిపై బర్వుచుండ
కొంతతడవున కొదవె నొక్కింత శాంతి.
ప్రియతమా, తావకీనాస్యబింబ చింత
నమ్మునం దుంటి శర్వరీనాథకిరణ
ధౌతశీత వితర్దికా తలమునందు-
అవిదితమ్ముగ నిదుర న న్నావహించె.

## ౨౮

చంద్రికలు కాయుచు శరద్రాత్రి సమాగమమున
సమధికోత్తుంగ నిర్జన సౌధ వీథుల
జాల మార్గాంతికంబున శయ్యనుండి
సవ్వళించితి స్వప్న సంభాషణమున.

కౌముదీ స్పర్శచే గవాటిమల్లికల
విరియ బూచిన 'శేఫాలి' పరిమళంబు
సాగసాగెను పవన సంచలనమున
నిఖిల దిక్కుల నిబిడమై నిండిపోయె.

సొబగు శేఫాలి వాసనాస్ఫూర్తిమైన
స్ఫురణకుం దాకె నా రాణి సోయగమ్ము.
ప్రేయసీ, మానసము విజృంభించుకతన
నీ తలంపులతో రేయి నిదుర లేదు.

ఈ విధంబుగ గడచిన వెన్నెల నిశలు!
కలువ కనుదోయి నిరత జాగరముచేత
ఫుల్లకోకనదచ్ఛవుల్ పూనె నకట!
ఏల దయ రాదు నామీద నేటికైన!

## ౨౫

నాన్నివాస సౌధాంగణ మండలమున
మిన్ను లోఁగొను ప్రఘూణ నిర్వ్యూహ వితతిఁ
బూలముక్కలు వరుసగాఁ బ్రేలుచుండ
నేఁ బ్రసర్వము గాఁగ మృత్పాత్రలందు.
నిన్నుఁ దలఁచుచు బిళ్ళగన్నేరు పూల
తోఁటకుఁ బోయుచుందును తోయములను
ఉభయ సంధ్యల విస్మృతి నొందకుండ
ప్రమతము, యహరహమును ప్రీతితోడ.
ప్రసవ పుంజమ్ము నొసగును ప్రతిదినమ్ము
సంజ ముక్కలు సహానుభూతి నాకు.
పలుకు రంగుల నీను నా విరులతోడ
నూర్కి నీ నామవర్ణముల్ కూర్చుచుందు.

## ౨౬

లక్ష్మి, నీ నామ మెంతయు లలిత మహహా!
ఎన్నిసారులు నేను జపించినానో
ఎన్నిపర్యాయములు లిఖియించినానో
తనివి తీరుటలేదు సుంతయును నాకు!

ఇతరులు సదంతికమున భాషించునట్టి
లందు వినవచ్చుచో లక్ష్మి యనెడి పలుకు
సంభ్రమంబున నా మేను ఝల్లు రనును
భూరితరముగ నొడలెల్ల పులకరించు.

పఠనకాలమునన్ గ్రంథభాగమందు
రచనలో లక్ష్మి యను నక్షరద్వయంబు
కానవచ్చినయంత నా కన్నుదోయి
హర్షవశమున నగును బాష్పాకులంబు.

ఎన్నిలక్షలసార్లు లే నింతకు మును
పల్కితిని వింటి లక్ష్మి యన్ పలుకు లక్ష్మి!
ప్రకృత మధురిమ పొడమ దీ పదమునందు
నిన్ను ప్రియతమ, చూడకమున్న నాకు.

౨౮

సంచలనశీల మైన నా స్వాంత మెట్లు
నిల్పుకొన్నావు నీపయి నిశ్చలముగ!
ఎట్లు హృదయేశ్వరీ, నీ కహీనగరిమ
గలిగె నింత మహావశీకరణశక్తి!
అన్యవశవర్తి కాక యిచ్ఛానుసార
గతిని చరియించు నీ మతంగజము నార,

కట్టనేసితినే గుణగణముతోడ:
ఇట్టి యుద్ధోరణిత నీను నెట్లు కలిగ!
విస్మయోద్దీపకము భవద్విజయమహిమ:
దేవి, నా కించుకేనియు తెలియదాయె,
ఇంత సులువుగ ఈ మతిమంతు డధిక
గర్వి యెట్టులు నీ పదాక్రాంతు డయ్యె!

## ౨౮

నా హృదయ వనమందు ననారతమ్ము
దారుణమ్ముగ చెలరేగు దావవహ్ని
శాంతి గనదాయె వైరాగ్య సలిలధార
లెంత వర్షింప – ఇంక నే నేమి చేతు!

మరచిపోవుదు నన్నను మరపు రాదు
అయ్యయో, జీవితేశ్వరీ, అనవరతము
నీ మహామోహినీమూర్తి నేత్రయుగళి
యెదుట నర్తించుచుండు – నే నేమి చేతు!

అనిశ భవదీయ భావనాయాస భార
వివశ మయ్యెను లక్ష్మి, యీ విరహిబుద్ధి.
దుర్లభ జనానురాగ దోదూయమాన
హృదయమున కేది గతి – ఇంక నేమి చేతు!

## ౨౮

ఈ తనువుపై విరక్తి జనియించె నాకు !
విడిచి తూలికా తల్పమ్ము విసువుతోడ
పవ్వళించితి ప్రమోదమును, బహుమానముగ
కఠిన పాషాణఫలక భాగమ్ము మీద.

లోచన రసాయనమ్ములు లోక మోహ-
న మనోహర చంద్రికా నిశలయందు,
ప్రమద లుంటాక కాలరూపమ్ము లైన
అంధకార భయంకర యామినులను-

శ్రమము హరియించి హృదయప్రశాంతి గూర్చు
చల్లని సమీరణము వీచు సమయములను,
ప్రబల రవమున శర్కరాపటలితోడ
చండిమమున రేగెడి ప్రభంజనములందు -

వేళ లన్నిట నే సమవృత్తితోడ
పవ్వళించితి పాషాణ ఫలకముపయి !
కాల మేగలి గడచెనో కాని యిపుడు
స్వప్నము విధాన దోచు సంస్మరణమందు.

బుద్ధిలోనుండి లోపించి పోయె నాకు
పూర్ణముగ హృదయేశ్వరీ, భోగవాంఛ.

కష్టమను సుఖమ్ము నను విభాగమ్ము లేక
నిర్గుణమ్ముగ నద్వైతనియతి నుంటి.

## ౩౦

తెర యావరింపగ మానసమ్ము,
పని చేయుటకును నాకు నిచ్ఛ లేదు.
సర్వమును తోచుచున్నది స్వప్నమట్లు
వెలలు గడచుచు నున్నవి నిష్క్రియముగ.

వాసరమ్ముల కొలది నుల్లాసగరిమ
పౌర్వము మదంతికమ్మున ప్రొద్దు పుచ్చి
మగుల న న్నాదరించెడి మిత్రులిపుడు
గాంచి ముఖభంగి శీఘ్రము కదలుచుండ్రు.

రమ్యరూపమ్ముతో మనోరంజనమ్ము
సలిపెడి విలాసవస్తువుల్ చక్షువులను
నేడు వేధించుచున్నవి నిశితశూల
ఫలక సంకాశ భయదరూపములు తాల్చి.

ఏది కనుగొన్న నాకిపు డేవగింపె!
నేత్రయుగ్మము మూసి యీ నిర్జనాల
యమ్మున విలోలహృదయ భారమ్ముతోడ
నవ్వలింతును పర్యంకభాగముపయి.

అఖిల వస్తువులం దనవరతమ్ము పుట్టు,
జగము నా దృష్టి కిపుడు నిస్సార మయ్యె,
వేమరు జనించుచుండును విసువు నాకు
నా పయింగూడ హృదయమునం దనుమానమును.

౩౧

నీ హృదయ మెట్టిదో ప్రియురాల, నిక్కముగ
ఇంతవరకును తెలియరా దేమి చేతు!
నీవు హృదయాపహారిణీ, నిశ్చల వయి
తొడుకున్నావు నైజ గాంభీర్యముద్ర.
అమలినం బగు నా ప్రణయాబ్ధి యట్లు
లతి గభీరమె తావకీనానురాగ!
మస్మదీయానురాగ హేమాద్రివోలె
ఒప్పునే నీదు ప్రేమ మహోన్నతముగ!
ఎంతకాలము నే నిరీక్షించుచున్న
నంపవైతివి ప్రియతమా, ప్రణయవార్త-
నీదు సొంపయి లేదేమొ నిబిడరక్తి —
అకట, సంశయ మిప్పుడు నన్నావరించె.

## 32

సౌధమున హంసతూలికా శయనమువయి
విశ్రమించు తలంపున వెన్ను వాల్ప,
తోచ హృదయేశ్వరీ, మహాదుస్సహముగ
వర్గము నాటి దుర్బలావస్థ నాకు.
ఈ విధానగ నా కది యేమొ కాని
తోచుచున్నది నేటికి దుర్భరముగ
ప్రియతమా, ముందు నీవు లభించు ఘటన
దుర్లభ పూర్ణిమాచంద్రికా తుల్య మగుచు.
విరహ సంతాపము ఘనీభవించి యుండి
ఆపుకొన్నను పొంగుచు ఆగకుండ
జాలుగా ప్రవహించు బాష్పములవలన
తడిసె హృదయేశ్వరీ, ఉపధానతలము!

# ఆశా జ్యోతి

## 33

తావకోజ్జీవని వినూత్న దర్శనోత్స
వోత్సుక మదీయ లోచనయుగళి దేవి,
భాగ్యముం గాంచె ప్రతికూల భాగధేయ
దుర్విపాకము నేటితో తొలగిపోవ !

నిలిచి మీసమున్నత సౌధ వలభిమీద
నీ విలోకన సౌభాగ్య నిష్ఠతోడ
నిమ్నభాగాంగణమ్మున నిర్నిమేష
లోచనయుగమ్ము సారించి వేచియుంటి.

అరుగుదెంచితి వపుడు నీ వజిరమునకు
కంధరము వాల్చి కేకినీగమనమునను.
నీవు తోచిన యాదిమనిమిషమందు
సమ్మదమ్మున గుండియ ఝల్లు మనియె.

కపిశవర్ణ మనోజ్ఞాంశుకమ్ము దాల్చి
దేవి, నీ వంగణమ్మున బోవుచుండ
శాద్వలస్థలి నల్లన సంచరించు
సాధు మృగకన్య నా స్మృతిసరణి దోచె.

సంస్కరింపక కేశపాశమ్ము నీవు
జారుముడి వేసికొంటి వశ్రద్ధతోడ,
శాణకోణాగ్ర దృఢనికషమ్ము గనని
ఇంద్రనీలమణిద్యుతి యింపు నింప.

పుణ్యము సమాచరించుట భూలతాంగి
తావక విలోకనప్రభా ధన్య యయ్యె;
గగనమండల, మట్టాలకమ్ము, నేను
సలుపమైతిమి పుణ్యలేశమ్ము కూడ!

క్రొమ్ముడిం గాంచి, కమ్రచేలమ్ము గాంచి,
శబలిత శ్రోణి రమ్యదేశమ్ము గాంచి,
సలకుశేశయ రుచిరపాదములు కాంచి,
దేహభంగిమ గాంచి, నే దృష్టిగంటి.

## ౩౮

బహుళ నిర్వేదభర పరంపర మదీయ
చిత్త కుహరమ్ము నావరించిన విధాన
గగన రంగస్థలమ్ము నాకస్మికముగ
ప్రబల నీరంధ్ర జలధరపటల మలమె.

సూచికాభేద్యమై తమఃస్తోమ మపుడు
క్రమ్ముకొనియెను దిగ్దిగంతమ్ములందు.

మార్గమును వీడిపోవక మందగతిని
పదము లిడుచుంటి నభ్యాసబలముచేత.

అల్లనల్లన నేను మీ హర్మ్యసవిధ
భాగముం జేరగా ప్రభాపటలి తోచె
ముక్త నిమ్నవాతాయన ముఖమునందు
యామినీ కామినీ మందహాసమట్లు.

దేవి, తావక మధుర దేదీప్యమాన
శాంతముగ్ధ విలోకనక్షణమునందె
విరిసిపోయెను హృదయ నిర్వేదభరము
తరణికిరణ ప్రభాస్పృష్ట తమముభాతి.

గగనతల మావరించిన కాలమేఘ
పటలము తటాలునం బటాపంచ లయ్యె,
మినుకు మినుకని చుక్కలు మెరయజొచ్చె,
దిక్కు లన్నియు నొక్కట తెలివి నొందె.

## 3గీ

పరిగణింపక మధ్యాహ్న భానుతాప
మాతపత్రము కుడిచేత నడ్డు పట్టి
త్వన్మనోహర వదన సందర్శనేచ్ఛ
బయలువెడలితి మీ సౌధపథమువెంట.

అస్మదీయ విశేషభాగ్యమ్మువలన
వివృతమై యుండె ద్వార మాంవేళయందు.
బంధు పరివృత వగుచు సంభాషణమున
ప్రియతమా, కూరుచుంటివి పీఠమువయి.

స్మితగండస్థల ప్రతిబింబితాచ్ఛ
దివ్యతాటంకయుగళ సందీప్తవదన
మండలమ్ము వెలింగెను మదన దేవు
రమ్య జైత్ర చతుశ్చక్ర రథముపోలె.

సహజ నిబిడానురాగార్ద్ర శాంతరుచిర
నేత్రయుగ్మము నామీాద నిలిపినావు:
విపులహర్షమ్మునన్ మేను విస్మరించి
కౌముదినిబోలె నెండలో కదలిపోతి.

## ౩౬

శాంతగతి నేను మీా మొగసాల జేర,
అధివసించి మనోజ్ఞ పటాసనమ్ము
చదువుచుంటివి "శ్రీరామ చరిత మాన
సమ్ము" ప్రియతమ, కాకలీస్వరముతోడ.

స్తంభపార్శ్వస్థ సుమలతా జాలమునకు
చాటున న్నిల్చి, నీవికస్వరముఖమ్ము

కనుల పండువుగాఁ గాంచి కదలిపోతి
కర్ణముల మ్రోగుచుండఁ నీ కలరవమ్ము.
ఎంతొ సుకృతము చేసిన జెలియ "భాష"
అట్లు కాదేని దానికి నబ్బె నెట్లు
నా మనోహారిణీ రసనాసుధార్త
దీప్ర పరిపూర్ణ మధురిమోద్దీపనంబు!

## ౩౭

ప్రణయినీ, జ్యేష్ఠమాస ప్రభాతరమ్య
సమయమున నేను మీ ప్రకోష్ఠమ్ము జేరి
గురుజన సమాదరమ్మున గూరుచుంటి
నీటి, భవదీయ దర్శనాపేక్షతోడ.

అవల మేము భాషించెడి యవసరమున
మామకీన స్వరాకృష్యమాణ వగుచు
వల్లు గమనమ్ముతో జేర వచ్చినావు
జీవితేశ్వరి, నన్ను వీక్షించుకోర్కి.

సన్నిహిత మా కవాటపార్శ్వమున నీవు
నిలిచి నాపయి చూపులు నిలిపి యుండు
నపుడు నా హృదయ స్పంద మధిక మయ్యె
నేత్రయుగ్మము సమ్మదోన్నిద్ర మయ్యె.

అంతటి సమీపమునకు నీ వరుగుదెంచి
ప్రియతమా, నిల్చుచో మహాప్రేమ మొల్క
దృక్కుల, మదీయ హృదయ ముద్రిక్త మయ్యె
కాంత, పొడమె తటాలున కౌగిలింప!

శీత పవనము నీ ముఖ సీమ సోకి
అలకలు స్పృశించి అవల చేలాంచలంబు
మృదుగతి గదల్చి ముదకు నా మేని నంట
పరవశుడ నైతి సమ్మద ప్రాభవమున.

అవల నల్లన వాతాయనాంతికమ్ము
జేరి హృదయేశ్వరీ, సమాసీన వగుచు
నిర్భర ప్రీతి నుత్ఫుల్ల నేత్రములను
గూఢముగ మన్ముఖ ప్రభల్ గ్రోలినావు.

నీకు నామీది నవనవోన్మేష రక్తిఁ
జెప్పకయె చెప్పుచుండె నోస్నిగ్ధహృదయ,
ఆననమ్మున విద్యోతమాన దీప్తి,
తరళ నయనోచ్చల త్సముత్కంఠ దృష్టి.

గురు జనాంతికమందు గైకొని యనుజ్ఞ
వెడలి పోవుచు సేవరావృత్తి నొంది
నప్పు డుపలబ్ధ మైన రాగార్ద్ర దృష్టి
మన్మనోహారిణీ, యెట్లు మరపు వచ్చు!

## ౩౭

అపుర, నాకంటె నెంతటి యధిక విశద
పుణ్య మొనరించె నీ యింటి పొగడచెట్టు!
వివిధ విధముల నిన్ను సేవించుచుండి
యుక్తమైన ఫలమ్ముల నొందుచుండు.
ఆయత గవాక్ష పార్శ్వ వేత్రాసనమ్ము
నధివసించి వనప్రియా మధుర ఫణితి
కావ్యముల్ నీవు పఠియించు కాలమందు
చల్లదన మిచ్చు వకుళ వృక్షమ్ము నీకు.
క్లాంతి గని నీవు మధ్యాహ్న కాలమందు
మృదుల పర్యంక తలమున మేను చేర్ప
జలువు శీతల మారుత చాలనంబు
తాలవృంతాయమానమై తరువు నీకు.
చల్లబడినంత సాయాహ్న సమయమందు
మధుర విలసనమున నీవు మండనమ్ము
చేసికొనుచుండునపుడు విచిత్రపత్ర
విభ్రమము గొల్పుచుండు పృథ్వీరుహమ్ము.
జాలమార్గమునందు నిషణ్ణవైన
నీకు రజనిని వకుళావనీజ మధిక

సౌరభవ్యాప్తి గొల్పు విహార లీల
మధుర భావోపవన రమ్య మార్గములను.

నీవు తల్ప శయానవై నిదుర వోవఁ
గన్నగవ మూయ వకుళవృక్షమ్ము నీకు
మంద పవన చలత్పర్ణ మర్మరాను
గాన ధోరణి స్వాపము గలుగ జేయు.

నిన్ను కరుణాతరంగిత నేత్రయుగళి
నీక్ష సారించు వేళల వృక్షరాజు
సమ్మదోదిత సంచలనమ్ము గ్రమ్ము
కంపమాన పత్రావళీ కైతవమున.

కుసుమములు సంగ్రహించెడి కోర్కె నీదు
మృదుమకర స్పర్శనమ్మున నుదితమైన
నీసథువు మంటుకొనుచుండు వృక్షరాజు
భూరి సంభ్రమ పతయాళు పుష్పమిషను.

అపుర, నాకంటె నెంతటి యధిక విశద
ఘృణ్య మొనరించె మీ యింటి పొగడచెట్టు !!
వివిధ విధముల నిన్ను సేవించుచుండు
భాగ్యమైన ఫలమ్ముల నొందుచుండు !

## ౩౮

అస్మదీయ ప్రియా మృదు హస్త లిఖిత
దివ్య నాగర వర్ణ మౌక్తికములార !
అపగతం బయ్యె నేత్ర జాడ్యమ్ము మిమ్ము
గాంచ గల్గుటచే చిరకాలమునకు !

భవ్య గీర్వాణ వాణి మాసప్రతిష్ఠఁ
బొందె నత్యంత మాన్యత పూర్వమందె ;
ప్రణయినీ కరలేఖన ప్రాభవమున
మాన్యతరము నాగర వర్ణమాల నేఁడు.

తోఁచుచున్నవి నూతన ద్యుతి మదీయ
నామధేయాక్షరమ్ము లీనాఁడు నాకు,
రమ్య మూర్తులతో ద్వారము తదీయ
హస్త పల్లవ విలిఖితం బగుటవలన.

ఆమె రూపము గాంచు భాగ్యమ్ము లేక
నిజ వికాసము తరుగు నా నేత్రములకు
నూతనోల్లాస మిచ్చు పసూన భంగి
సంఘటించితి రహాహా, అక్షరములార !

జీవితేశ్వరి, హృదయ విజృంభమాణ
విమలరాగము నీరీతి వెల్లడించి

సంచలించెడి మామకాశాప్రదీప
శిఖను పోషించితివి నేడు స్నేహావృష్టి.

## ౪౦

పుణ్య మొనరించినావు మత్పుస్తకంబ !
ఎంత సుకృతమ్ము చేయుని దెటు లభించె
నాకు దుర్లభ మయ్యును నీకు నామె
పాణి పల్లవ మంజుల స్పర్శనమ్ము !
ఎంత సుకృతమ్ము చేయుని దెటు లభించె
కమ్ర తత్కర నీరజ గ్రథిత మైన
లలిత నాగర ముక్తాఫల స్రజంబు !
భూరి సుకృతివి నీవు మత్పుస్తకంబ !

ఎంత సుకృతమ్ము చేయుని దెట్లు నీకు
పఠన కాలమునందు సంప్రాప్త మయ్యె
ఆశ్రవోయుగ విశ్రాంత హారి లోల
నయన విగళ ద్విరాసిత నలినపంక్తి !
అనిలవశమున తన్మధురాధరమ్ము
గండపాళి యుత్తుంగ వక్షః స్థలమ్ము
స్పర్శనము చేసియుందువు చాలసార్లు:
నీవు నాకంటె సుకృతివి నిశ్చయముగ !

# ४౧

నేను మీ ప్రాంగణమ్మున నిలిచియుండ
కామినీజన మంజుల కంఠ జనిత
దివ్యసంగీతరవ మరుదెంచి నాదు
విస్మయము గొల్పి వీనుల విందు చేసె.
జీవితేశ్వరి, గానము చేయుచుందు
వనెడి యాశ తటాలున నంకురింప
మోదమున కక్ష్యకే నభిముఖుడ నగుచు
గాంచితిని నిన్ను కన్నులకరవు తీర !
లలితకర్ణాట పట్టుచేలమ్ము దాల్చి
అపుడు ప్రియతమ, అర్ధశయాన వగుచు
వెలయుచుంటివి పర్యంకతలముమీద
రమ్యపీఠముపై మహారాజ్ఞివోలె.
లేచితివి నన్ను గాంచి సలీలముగను :
పల్కరింపగ నిన్ను నే ప్రశ్నిమిపను
కీరగళమున బదులు పల్కితివి నుమ్మి
లజ్జ నర్తింప నీ కపోలములమీద.
నేడు సుదినమ్ము ప్రియతమా, నీ మనోజ్ఞ
కంఠరవ మాలకించు భాగ్యమ్ము కలిగె,

ప్రథమవారము నీతోడ భాషణమ్ము
సలుపజాలు నదృష్టమ్ము సంఘటిల్లె!
సాగెసాగెను మ్రోగు నా శ్రవణయుగళి
గళ దమృత తుల్య మౌ భవత్కంఠరవము.
మృదులగాన తరంగిత హృదయసీమ
పొలుచుచున్నది గంధర్వభూమి వోలె!

౪౨

దేవి, నే నొకనాడు జ్యోతిష్కు జేరి
జన్మపత్రిక యతనిహస్తమున నుంచి
"శాస్త్రదృష్టిని స్వామి, ఈ జాతకునకు
జీవితేశ్వరి యెట్టిదో చెప్పు" డంటి.
కంప మొందగ హృదయ ముత్కంఠ, నాత
డేమి పల్కునో యని నిరీక్షించుచుంటి.
ఆననమ్మున దరహాస మంకురింప
ఆదరమ్మున దైవజ్ఞు డనియె నిట్లు :
"ఆర్య, మీ ప్రియురాలు మహాకులీన,
పరమ కోమల హృదయ, లావణ్యమూర్తి,
అధిక గుణవంతురాలు, విద్యాభినిరత :
ఒప్పు ననుకూలదాంపత్య ముభయులకును.

"తథ్యము వచింతు నేనింక దాసుకుండ:
మీరు భార్యావిధేయులై మెలగుచుండ్రు"
అనగ మోహమున చిరునగ వంగవించి
జేసినాను నమస్సులు భూసురునకు.

## ౪౩

ప్రియతమా, నేను నిక్కి ప్రీతితోడ
పుష్పమాలిక బంధగుచ్ఛమ్ములోని
స్నిగ్ధు లుంచిరి మత్కాంత సీమయందు,
నచ్చుటం జేసి మజ్జన్మవాసరమ్ము.
కంబు మంజుల మౌ భవత్కంఠమందు
ప్రియతమా, పుష్పదామ మర్పింప నిమ్ము.
గాఢనీల మనోహర కైశికమున
ప్రసవములు కూర్ప నిమ్ము నీ ప్రణయిజనుని.
పరమ కల్యాణ రమ్య భూషమ్ము దాల్చి
జీవితేశ్వరి, నీవు హృత్సీమ మెలగ,
స్నేహితో మిత్రులం గూడి వివిధగతుల
వాసరము బుచ్చితిని మహోల్లాసమునను.
ఉత్సవము చేయుదును ప్రియా, యుష్మదీయ
జన్మవాసరవేళ నుత్సాహగరిమ.

ఎప్పుడు ఘటియిల్లు జేసెదో యీ సుఖమ్ము
సతత భవదీయ సేవనాసక్త మతికి !

## ౪౪

ప్రబల భవితవ్యతా ప్రభావమ్మువలన
స్థూలదేహము మిక్కిలి దూర మయ్యె
అనిశము మదీయ సూక్ష్మదేహమ్ము నిన్ను
ననుసరించును ప్రేమతోడ, ఆదరమున.

స్వాంతి నీ కించుకేనియు గలుగ నీక
చామరము వేయుచుండు నిశ్శబ్దముగను.
గమనమున తొట్రుపాటు సంఘటిల నీక
నీ వ్ననుసరించి చరియించు నేను గూడ.

మజ్జనానంతరము నీవు మండనమ్ము
చేసికొనుచుండు వేళ నేను సుస్మేరనయన
జలజముల గాంచుచుండు పార్శ్వమున నిలిచి
విమల భవదీయ కమనీయ విగ్రహంబు.

కావ్యమును చేత బట్టి యేకాంతమందు
శ్రావ్యముగ నీవు మెల్లన చదువుచుండ
సమయమున విందు కర్ణరసాయనముగ.
ప్రణయినీ, నిల్చి నీ వామభాగమందు.

నీవు హృదయేశ్వరీ, గాఢనిద్ర వోవు
కాలమున నేను పర్యంకికా సమీప
సంస్థితుడనై నివారింతు సకలభూత
వార మంగుళి, నీదరి జేరనుండ.

స్వప్నకాలమునందు హర్షమున నీవు
నాథ యనియెడి సంబోధనమ్ము చేయు
గాఢరక్తి ముఖావలోకన మొనర్చి
కాంత, ఆనందగరిమ దీపింతు నిన్ను!

౪౨

మలయపవనాంకురావళుల్ మలయుచుండు
సంజవేళను మా మొగసాల కేను
వచ్చినది నిన్ను దర్శించు వాంఛతోడ,
కూరుచున్నది పెద్దల కోర్కిమీద!
ఇంతలో హృదయేశ్వరీ, శాంతగతిని
వచ్చితివి నీవు ద్వారపార్శ్వమ్ము జేర.
ఆ క్షణమ్మె నికాము నిరంకుశుండు
కామదేవుడు దృక్కులు కలిపినాడు.
అన్యులకు గానరాకుండునట్లు, నాకు
నభిముఖమ్ముగ నున్న వాతాయనమును

దరిసి, చెక్కుల నోరగా చెరచి నన్ను
చూచితివి ప్రియసీ, మహాత్సుకతతోడ.

నన్ను గొనిపొమ్ము మస్మనోనాథ యన్న
విధమునం దోచె నపుడు నీ వీక్షణములు.
మదనదేవుడు నిరుపమ మధ్యవర్తి
నిన్ను నర్ధాంగిగా నాకు నిర్ణయించె.
విదితమేమని తిరోధాన విద్య నాకు
అచటి నీ బంధుజనమున కవిదితముగ
సత్వరమ్ముగ నిశ్శబ్దసరణి నిన్ను
భుజబలంబున నపుడె కొంపోయి యుందు.

గడియల కొలంది నా గవాక్షమ్ము దరిని
నిల్చి ప్రేమార్ద్ర దృక్కుల నీవు లక్ష్మి,
నను విలోకించుచో మహానందవృత్తి
నేమి భాషించి యుంటినో యెరుక లేదు!

## ౮౬

తీర్థ యాత్రాభిలాషినై దేవి, నేను
పోవనెంచితి ఈ యాంధ్రభూమి విడిచి.
హాయనమ్ములకొలది దేశాటనమ్ము
సలుపగా నాకు సమధికోత్సాహ ముండె.

నిన్ను గాంచిన యామినీమునిమాపమునను
ఎగిరిపోయెను నాయసూయాహంకారతెరలె నపుడు.
నాటినుండియు దేవి, మీ నగవు నాకు
తథ్యము వచింపు—వైకుంఠధామ మనుచు !

## ౪౭

ఏ శుభముహూర్తమున మన యాత్మనయనములు
విమలరాగముతో మేళవించె నోలతాంగి
అపుడె నాహృదయేశ్వరివై తదాది
ఏలుచున్నావు నీవు నా హృదయసీమ.
హృదయముం జొచ్చి కాంచెదనేని దేవి,
అమల తావక మూర్తి ప్రత్యక్ష మగును.
రమ్య భవదీయ నామాక్షరములు విమల
రోచి రుట్టంకితమ్ములై గోచరించు.
నిర్భరానంద బుద్ధినై నిరుపమంబ
తావకీన స్తవమ్ము పద్యముల గూర్చ
ప్రియతమా, వాఙ్మయమున నీపేరు నిల్చు
శాశ్వతమ్ముగ నా హృదయేశ్వరి వని.

## ౪౮

అమరు నా యెడ నీకు గాఢానురాగ
మను మహోహర్ష జనక వృత్తాంత కలన
వరలు చున్నాడ నుత్ఫుల్లవదనుడ నయి,
శాంతి నెలకొన్నయది ప్రియా, స్వాంతమందు.

నీవు హృదయేశ్వరీ, నన్ను నెమ్మనమున
నిరుపమ ప్రేమతోడ ధ్యానించుచుందు
ననుపదమ్మని యవగత మగుచునుండు
నాకు నీ ముఖపద్మ విలోకనమున.

కర్మ పరిపక్వమై శుభక్షణమునందు
దైవకృప నుపలబ్ధమౌ తావకీన
పాణి యనియెడి నిశ్చల ప్రత్యయమ్మె
లక్ష్మి, నా కిక జీవితాలంబనమ్ము.

నిర్భరప్రేమ వివశవై నీ వధైర్య
తిమిరముం దోలి సాహసోద్దీప్తితోడ
పూర్ణవిశ్వాసమున మనఃపూర్వకముగ
లీల మదురఃస్థలమ్ముపై వాలువరకు –
కల్పములతీతమై పోవుగాక దేవి,
వేచియుందు వికస్వరలోచనముల

ఏకనియంత్రుని లోక మీక్షించుచున్న
శ్రీమ దవలోకి తేశ్వర స్వామి వోంట!

## తృతీయాధ్యాయము

## వై తా ళి క ము

### ౪౯

మేలుకొను మో జీవితేశ్వరి!
జాల మేటికి, చూడు మియ్యెడ
జాల మార్గము క్రింద నిల్చితి పూల చాలులలో.

యోజనమ్ములదూర మేను మ-
హోజవమ్మున దాటి చేరితి
నోజ నిట భవదీయ వదనాంభోజ మీక్షింపన్.

చాలకాలము గడచినది ప్రియు
రాల, కన్నులపండువుగ నీ
వాలుగన్నుల తరళకాంతులు వాలి నామీదన్.

మించు ననురాగమ్ముతో నే
తెంచితిని హృదయేశ్వరీ, నే-
త్రాంచలమ్ముల ప్రణయిజను వీక్షించు మనురక్తిన్.

ఇంతకాలము ప్రణయినీ, నీ
యంతికమునకు నేను రామికి
నెంతగా జింతించుచుంటివొ అంతరంగమునన్!

నిక్కముగ ప్రాణేశ్వరీ, నే
నొక్క నిమిసం బైన నీ స్మృతి
దక్కియుండగ లేనుసుమి యే దిక్కునను దిరుగన్.

ఉల్లసద్భవదీయ రూపం
బుల్లమున నెలకొల్పి దృఢముగ
ఎల్లవేళల దలతు నిన్నుత్ఫుల్ల నేత్రముద్రన్.

ప్రేయసీ, ఉత్సుకమగు వా
తాయనాధ్వమువెంట నను భవ
దాయతాక్షుల గనుము నా కాశ్వాసనము కలుగన్.

కాంత, యీ దూరప్రయాణా
క్రాంతి వోవగ స్నేహపూర్ణా
త్యంత శీతల వీక్షణంబుల సుంత కనుగొననే!

## ౫౦

అంతరిక్షమునుండి రజనీ
కాంతు డఖిలముఖమ్ముల న్నిజ
కాంతులన్ వెదజల్లు, నా ప్రియకాంత, కనుగొనవే!

ఈ మనోహరవేళ ప్రియతమ,
కౌముదీ ధవళీకృతము లౌ
భూమిజంబుల నొప్పు నుపవనసీమ గన్గొనవే.

అలకజాలాచ్ఛాదితంబై
తిలకరేఖోదంచితంబై
అలఘు సౌభగ వదన మండల విలసనము కనవే!
ప్రేంఖణాంచిత మల్లికా సుమ
సుమాలికోజ్జ్వల మద్గళమ్మున
లోల భవదీయోష్ఠణమ్ముల వ్రాల నీయగదే.
భూరి చిత్రాంచల సముజ్జ్వల
గౌర కౌశేయోన్నృత శేణి
దోసు గాంగేయముల ప్రేయసీ, యిటు తేరి చూడగదే!
అలస యాని భ్రమ చెంది రస
స్ఖలితభంగిమ గాంచి పథమున
సలుపు దోహ్వాదయోన్నత్యగీ, ఈ చెలువముం గనవే!
అనవరత భవదీయ దృష్ట భా -
వనమునం బరివర్తితంబై
తనరు నీ ముఖమట్లు నా యాననము గన్గొనవే.
లలిత నేత్రవిలోకనమ్మున
వలపు కలిగెను నాకె నాపై-
దళితమంజుల నీల నయనోత్పలములం గనవే.
ముదిత హృదయముతోడ నీ కా
ముదిని మధురారామ సంస్థితు
హృదయరాజ్ఞీ, గాఢరాగాస్పదుని గన్గొనవే!

